** మూడణాలు **



ప్రతులకు:

మేనేజరు,

'నవయుగ'

బ్రాడీపేట

గుంటూరు



లీలా బుక్ డిపో

గవర్నరుపేట

విజయవాడ

Printed & Published by N. V. NARAYANA,
Publisher Navayuga ' Guntur,
Printed at Abhyudaya Press.

# చైనా వ్యవసాయక విప్లవం

[ ఏప్రిల్ 1వ తేదీనాడు షాన్సీ - షుయాన్ విముక్త ప్రాంత పార్టీ సమావేశంలో కామ్రేడ్ మావోసేటుంగ్ ఇచ్చిన ఉపన్యాసంలో ప్రధాన భాగాలు. ]

కామ్రేడ్స్,

ఈనాడు షాన్సీ-షుయాన్ మండల కార్యక్రమానికి సంబంధించిన కొన్ని సమస్యలను గురించి ముఖ్యంగా మాట్లాడదలచుకున్నాను. తర్వాత మొత్తం చైనాకు సంబంధించిన విషయాలను గురించి కూడా మాట్లాడతాను.

## జయప్రదమైన వ్యావసాయక సంస్కరణలు

షాన్సీ-షుయాన్ సబ్‌బ్యూరో నాయకత్వాన గత సంవత్సరం ఈ ప్రాంతంలో వ్యావసాయిక సంస్కరణలకు సంబంధించీ, పార్టీ శుద్ధి పునర్నిర్మాణ విషయాలలోనూ మన కార్యక్రమం విజయవంతమైందని నేను భావిస్తున్నాను.

ఈ విషయాన్ని రెండువిధాలుగా చూసి చెప్పుతున్నాను. ఇక్కడ పార్టీ ఒక వంక మితవాదధోరణులను వ్యతిరేకించింది. ప్రజాపోరాటాలను ప్రారంభించింది. పూర్తి చేసింది. ఇంకా ఇప్పుడు వ్యవసాయ సంస్కరణ, పార్టీ శుద్ధి, పునర్నిర్మాణ విషయాలలో కార్యక్రమాన్ని పూర్తిచేస్తోంది. 30 లక్షల జనాభా కలిగిన ఈ ప్రాంతంలో 20 లక్షల మందికిపైగా ఈ కార్యక్రమాన్ని నిర్వర్తించాగు.

మరొకప్రక్క షాన్సీ-షుయాన్‌లో పార్టీ ఉద్యమంలో ప్రవేశించిన అనేక 'అతివాద' ధోరణులనుకూడా సరిచేసింది. ఈవిధంగా చేయటంద్వారా మొత్తం కార్యకలాపాలు సరైన గాడిన పడేటట్లుచేసింది. విషయాన్ని ఈ రెండువిధాలా చూసి నప్పుడు, వ్యవసాయిక సంస్కరణ, పార్టీశుద్ధి, పునర్నిర్మాణ విషయాలలో ఇక్కడ పార్టీ అవలంబించిన కార్యక్రమం జయప్రదమయిందనే నేను భావిస్తున్నాను.

"ఇది జరిగిన తర్వాత తిరిగీ జమీందారీ తత్త్వంతోగాని, మొండిగాగాని, అవినీతిగాగాని ప్రవర్తించటానికి ఎవ్వరికీ దమ్ములుండవు" అని ఇక్కడ ప్రజలు చెప్పుకుంటున్నారు. మన వ్యావసాయికసంస్కరణ, పార్టీశుద్ధి, పునర్నిర్మాణ విషయాలను గురించి వారు వచ్చిన నిర్ణయమిది. "తిరిగీ జమీందారీతత్త్వంతో వ్యవహరించేందుకు ఎవ్వరికీ దమ్ములుండవు" అని వారు చెప్పుతున్నారంటే దాని అర్థం - నూత్న విముక్త ప్రాంతాలలో జమీందారీ దోపిడీ విధానాన్ని నాశనం చేసిన, చేస్తున్న, పోరాటాలలోనూ, పూర్ణ విముక్తప్రాంతంలో, ఈ మధ్య విముక్తి అయిన ప్రాంతాలలో జమీందారీ అవశేషాలను తుడిచిపెట్టటానికి జరిగిన, జరుగుతూన్న పోరాటాలలో వారికి మనం నాయకత్వం వహించామని వారి భావం. "తిరిగీ ఎవ్వరూ మొండిగానూ, అవినీతిగానూ ప్రవర్తించటానికి దమ్ములుండవు" అని చెప్పటంలో వారిభావం - గతంలో మనపార్టీ, గవర్నమెంటు నిర్మాణ విషయాలలో అటువంటి తీవ్రమైన స్థితిగతులున్నాయన్న మాట! పనిస్వభావంలోనూ, పనిచేసే విధానంలో కొంత అవినీతి ప్రవేశించింది. కొన్ని దుష్టశక్తులు పార్టీ నిర్మాణంలోకీ, గవర్నమెంటు నిర్మాణంలోకీ కొట్టుకొచ్చాయి. చాలా మంది నిరంకుశంగా పనిచేయటం అలవాటు చేసుకున్నారు. అధికార దుర్వినియోగం చేసి ప్రజలను భయపెట్టారు. తమ పబ్బం గడుపుకోటానికి బలత్కార పద్ధతులను ప్రవేశపెట్టారు. ఈవిధంగా ప్రజలను అసంతృప్తులను చేశారు. అవినీతి నేరానికైనా గురయ్యారు, లేక ప్రజాఅవసరాల విషయంలో అధికసౌఖ్యమైనా కలుగజేసుకున్నారు. పై పరిస్థితులన్నీ గత సంవత్సరం జరిగిన వ్యావసాయిక సంస్కరణలలో, పార్టీశుద్ధి పునర్నిర్మాణ కార్యక్రమాలలో సమూలంగా మార్పుచెందాయి.

లేదా "మనకు పనికిరాకుండా కుళ్లిపోయినదంతా తొలగించబడింది. ఇదివరకు ఉన్న కొరత యిప్పుడు పూర్తిచేయబడింది" అని ఇక్కడ హాజరయిన కామ్రేడ్స్‌లో

ఒకాయన నాతో అన్నాడు. తుళ్లిపోతున్నదంటే గవర్నమెంటు, పార్టీని నిర్మాణాలలోనూ, కార్యక్రమ విధానంలోనూ, నిర్వాహణలో ఏర్పడిన కత్తిరింపు యొక్క తీవ్ర స్వరూపం ప్రజలలో పెరుగుతున్న అసంతృప్తి అని ఆయన భావం. ఈ పరిస్థితి ఇప్పుడు మొదలంగా తొలగింపబడింది. ఇదివరకు కొరతగా ఉండి ఇప్పుడు తీర్చబడిందేమంటే - పేద రైతు సంఘం, కొత్త రైతు సంఘం, గ్రామ, తాలూకా ప్రజా ప్రతినిధి సభలు ఏర్పడటం, పార్టీ శుద్ధి పునర్నిర్మాణాలవల్లా వ్యావసాయిక సంస్కరణలవల్లా గ్రామసీమలలో నూతన కలయిక ఏర్పడింది అని ఆ కామ్రేడ్ భావం.

ఇవి వాస్తవానికి సంబంధించిన అభిప్రాయాలని నా ఉద్దేశ్యం. ఇది షాన్సీ - షు యాన్ ప్రాంతంలో మనం సాధించిన మహత్తర విజయం. ఇది అంతిమ విజయానికి ప్రథమ సోపానం. ఈ ఆధారంతోనే షాన్సీ - షు యాన్ పార్టీ గురుతరమైన యుద్ధ నిర్వాహణ బాధ్యతలను నిర్వర్తింప గలిగింది. గత సంవత్సరాలలో మహత్తరమైన ప్రజా విప్లవ సమరాన్ని నిలపగ కలిగింది. ఇంత జయప్రదమైన వ్యవసాయిక సంస్కరణల, పార్టీ శుద్ధి పునర్నిర్మాణ కార్యక్రమాలను మనం అమలు జరిపి ఉండకపోయినట్లయితే ఇంత ఘనమైన సైనిక విజయాలను నిర్వహించటం కష్టమయ్యేది

## "అతివాద" ధోరణులు :

మరొకప్రక్క ఇక్కడ పార్టీ కార్యక్రమంలో ప్రవేశించిన అనేక "అతివాద" ధోరణులను సరిచేసింది. ప్రధానంగా మూడు ధోరణులుండేవి. మొట్టమొదటిది వర్గ స్వభావాన్ని నిర్ణయించటంగురించి - చాలా ప్రదేశాలలో అనేకమంది జమీందారీ దోపిడీ విధానంలో భాగస్థులు కాని వారినీ, లేకపోతే జమీందారీ దోపిడీలో స్వల్పంగా భాగస్థులయిన కష్టజీవులనుకూడా, అక్రమంగా భూస్వామి, లేక ధనిక రైతులక్రింద పొరపాటున జమకట్టటం, ఆ విధంగా మనం ఎదిరించవలసిన వర్గ సంఖ్యను అనవసరంగా పెంచుకోటం జరిగింది. వ్యావసాయిక విప్లవంలో నూటికి 92 మంది గ్రామీణులను లేక గ్రామీణ జనాభాలో నూటికి 90 మందిని అంటే - మొత్తం గ్రామీణ శ్రమజీవులందరినీ - ఐక్యపరచి ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకంగా ఐక్య సంఘటనలోకి తెచ్చే అవసరం, అవకాశంకూడా ఎంతో ఉంది. మన ఎత్తుగడలో ఇంతటి అతి ప్రధానమైన ముఖ్య సూత్రాన్ని మర్చిపోవటం జరిగింది. ప్రస్తుతం ఈ ధోరణి చాలావరకు సరిచేయబడింది. ఆ విధంగా ప్రజాహృదయాలను సుముఖం చేసి, విప్లవ ఐక్య సంఘటన దృఢతరం చేయబడుతుంది.

రెండవ ధోరణి : వ్యావసాయిక సంస్కరణల కార్యక్రమంలో భూస్వాముల, ధనిక రైతుల యాజమాన్యానయున్న పారిశ్రామిక, వర్తక వ్యవహారాలలో అనవసర

జోక్యం కలుగజేసుకోవటం వీరి ఆర్థిక విప్లవ వ్యతిరేక ధోరణులను మితిమీరి పరిశోధన చేయటం, పన్నుల విధానంలో పారిశ్రామిక, వాణిజ్యాలపై దెబ్బకొట్టటం, జరిగాయి. పారిశ్రామిక, వాణిజ్య విషయాలతో వ్యవహరించటంలో ఇవన్నీ "అతివాద" ధోరణులు, పరిశ్రమలూ, వర్తకం, కోలుకోటానికీ, అభివృద్ధికావటానికీ, అవకాశాలు కలుగజేయడంద్వారా ఈ లోపం సవరించబడింది.

**మూడవ విషయం :** గత సంవత్సరాలలో ఉధృతంగా జరిగిన వ్యావసాయిక విప్లవపోరాటంలో, విచక్షణారహితమైన దౌర్జన్యవిధానాన్ని అరికట్టటంలో హాన్సీ - షుయాన్ పార్టీ, పార్టీ క్రమశిక్షణకుఖచ్చితంగా కట్టుబడియుండలేకపోయింది. వ్యవసాయవిప్లవంలో కొన్ని ప్రదేశాలలో కొందరు భూస్వాములూ, ధనికరైతులూ అనవసరంగా చంపబడ్డారు. ఈ అవకాశాన్ని గ్రామాలలోని దుర్మార్గులు తమ కక్ష తీర్చుకునేందుకు అనువుగా ఉపయోగించుకుని, కొందరు కష్టజీవులను దారుణంగా హత్య చేశారు. ప్రజాతంత్ర విప్లవాన్ని తీవ్రంగా వ్యతిరేకించి వ్యవసాయ విప్లవకార్యక్రమాన్ని విచ్ఛిన్నం చేసే వారికీ, అంతులేని తప్పిదాలు చేసే క్రూరశక్తులకూ, విప్లవ ప్రతీఘాతశక్తులకూ, ప్రజాకోర్టులూ, ప్రజాస్వామిక ప్రభుత్వాలూ తప్పకుండా మరణ శిక్ష విధించాలి అది సక్రమమేనని మనం భావిస్తాం. ఇలా చేయకపోతే ప్రజాస్వామికపద్ధతే ఏర్పడదు. కాని సాధారణంగా కొమింటాంగు పక్షానికి చెందిన ప్రజాస్వామ్యానికి సంబధించిన ధనికరైతులూ, భూస్వాములూ, లేక తక్కువ దుర్మార్గాలు చేసేవారూ, వీరందరికీ మరణశిక్ష విధించటాన్ని నిరోధించాలి. ప్రజాకోర్టులూ, ప్రజా ప్రభుత్వాలూ, నేరస్థులను విచారించుతూండగా, కొరడా శిక్షలలాంటి వాటిని అసలు జరపటాన్ని నిరోధించాలి. పైన వివరించిన ధోరణికూడా గత సంవత్సరం హాన్సీ - షుయాన్‌లో ఉంది. ప్రస్తుతం అదికూడా సవరించబడింది.

పై ధోరణులన్నిటినీ సకాలంలో సవరించుకున్న తర్వాత, హాన్సీ - షుయాన్ బ్యూరో నాయకత్వాన కార్యక్రమమంతా సరైనబాటను పురోగమించుతుందనటానికి మనకు ఆధారాలున్నాయి.

## నిర్దిష్టమైన పంథా :

కమ్యూనిస్టులందరూ గట్టిగా గుర్తుపెట్టుకోవలసిన ప్రాథమిక కార్యక్రమసూత్రం, ఏమిటంటే, ప్రత్యేక పరిస్థితినిబట్టి స్పష్టమైన పంథాను నిర్ణయించాల్సి యుంటుంది. మనం చేసిన తప్పులన్నిటికీ కారణమేమిటని పరిశీలించితే, ఆయాస్థలా కాలాలకు సంబంధించిన భౌతిక పరిస్థితినుంచీ మనం వేరుపడి, భావవాదులుగా మన పంథాను నిర్ణయించటమేనని తేలుతుంది. ఇది ఒక గుణపాఠంగా కామ్రేడ్స్ అందరూ తీసుకోవాల్సి యుంటుంది.

పార్టీ శుద్ధి, పునర్నిర్మాణం విషయంలోనూ, వ్యవసాయసంస్కరణల విషయం లోనూ, కేంద్రకమిటీ పూర్వ విముక్తి ప్రాంతాలకూ, ఈమధ్య విముక్తిఅయిన ప్రాంతాలకూ ఇచ్చిన సూచనలను మీరుపార్టీ నిర్మాణ ప్రాథమికస్థాయిలను తీర్చి దిద్దటానికి వినియోగించుకున్నారు. పార్టీ శుద్ధి, పునర్నిర్మాణ విషయాలలో పింగ్షాన్ జిల్లా అనుభవాన్ని మీరు పాన్సీ - చాహార్ - హోపే విముక్త ప్రాంతంలో వర్తింపజేసుకున్నారు. అంటే పార్టీకి బయటఉన్న ప్రజాసామాన్యాన్ని పార్టీశాఖల సమావేశాలకు పిలిచారు. వారి ముందు కార్యక్రమ విధానంలోనూ, నిర్వహణలోనూ ఏర్పడిన కర్తీనంతటినీ తొలగించుకునేరీతిగా ఆత్మవిమర్శ గావించుకున్నారు. తద్వారా ప్రజాసామాన్యంతో సన్నిహిత సంబంధం ఏర్పర్చుకున్నారు. మీరీవిధంగా చేయటం పార్టీ శుద్ధి, పునర్నిర్మాణ కార్యక్రమ మంతటినీ జయప్రదంగా పూర్తిచేయటానికి మీకెంతో దోహదమిస్తుంది

తప్పులు చేసినప్పటికీ, ఇంకా సిద్ధాంత పరిజ్ఞానం కలుగజేయటానికి వీలుగాఉన్న వారినీ, సరమ్మతు చేయటానికి పనికివచ్చే పార్టీసభ్యులకూ, కాడర్లకూ, వారేవర్గానికి చెందినప్పటికీ, విషయపరిజ్ఞానం కలుగజేయటానికి పూనుకోవాలిగాని నెట్టివేయటానికి వీలులేదు. మీరీ సూత్రాన్నికూడా ఇప్పటికే కొనసాగించారు. ఇంకా కొనసాగించుతున్నారు. అదికూడా సరైనదే!

## ప్రజా ప్రాతినిధ్య కౌన్సిలు Peoples repregentative council

ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటసమయంలో పేద రైతుసంఘం, రైతుసంఘాల పునాదిపై గ్రామ,తాలూకా ప్రజాప్రాతినిధ్య కౌన్సిలు లేర్పర్చటం ఎంతో అమూల్యమైన అనుభవం వాస్తవంగా విశాల ప్రజాసామాన్య అభీష్టాలను పునాదిగా చేసుకున్న ప్రజా ప్రాతినిధ్య కౌన్సిలుతే ఆ పేరుకు తగిపోతాయి. ప్రస్తుతం వీటిని విముక్త ప్రాంతమంతటా ఏర్పర్చటం సంభవమౌతోంది. ఇటువంటి ప్రజా ప్రాతినిధ్య కౌన్సిలు లేర్పర్చగానే ఇవి ఆ ప్రాంతానికి సర్వాధికారాలగల సంస్థలుగా తయారుగావాలి. అధికారమంతా ప్రజా ప్రాతినిధ్య కౌన్సిలుకూ, దానిద్వారా ఎన్నుకోబడిన గవర్నమెంటు కమిటీలకూ, హస్తగతం కావాలి. అప్పుడు పేద రైతుసంఘం, రైతు సంఘం ఆ కమిటీలకు సహాయకారులవుతారు. వ్యవసాయకసంస్కరణలు సంపూర్ణంగా పూర్తి అయిన పిమ్మటనే వివిధ ప్రాంతాలకు సంబంధించిన గ్రామాలలో ప్రజా ప్రాతినిధ్య కౌన్సిలు లేర్పర్చాలని ప్లాను వేశాం. కాని ప్రస్తుతం మీ అనుభవం, ఉత్తర చైనా విముక్తప్రాంతం అనుభవం మనకేమని ఋజువు చేశాయంటే - వ్యవసాయ విప్లవ పోరాట సమయంలోనే ప్రజా ప్రాతినిధ్య కౌన్సిలులూ,వాటినుంచీ ఎన్నుకోబడే గవర్నమెంటు కమిటీలూ ఏర్పర్చటం సంభవమనీ, అవసరమనీ తేటతెల్లం చేశాయి. కాబట్టి

మీరా విధంగా చేయండి! విముక్త ప్రాంతాలన్నిట్లోనూ ఇదేవిధంగా చేస్తారు. గ్రామ తాలూకా ప్రజా ప్రాతినిధ్యకౌన్సిలు లంతటా ఏర్పడినప్పుడు జిల్లా కౌన్సిలు ఏర్పడ తాయి. జిల్లా, తాలూకా ప్రజా ప్రాతినిధ్యకౌన్సిలు ఏర్పర్చటంతో అంతకన్నా పైస్థా యిలో వివిధ ప్రాతినిధ్యకౌన్సిలు ఏర్పర్చటం సులభమౌతుంది. వివిధ ప్రజా ప్రాతినిధ్య కౌన్సిళ్ళల్లోకి అన్ని రకాల ప్రజాస్వామికవాదులూ (Democratic strata) ఉండేటట్లు చూడటం అవసరం. ఇందులో కార్మికులూ, రైతులూ, స్వతంత్రంగా జీవించే కష్ట జీవులూ, వృత్తిపనివారూ, మేధావంతులూ, లిబరల్ పారిశ్రామిక, వాణిజ్య బూర్జువా వర్గం ఇంకా ఇతర విజ్ఞానవంతులూ — సాధ్యమైనంతవరకూ వీరందరూ తమ ప్రాతినిధ్యం కలిగియుండేటట్లు చూడాలి. అంటే దీని అర్థం ఇటువంటి కలయికకోసం తాపత్రయ పడమనిగాదు నా ఉద్దేశ్యం. అంతకన్నా వాణిజ్య కేంద్రాలైన గ్రామాలకూ, కాని గ్రామాలకూ తేడా చూపిస్తున్నానన్నమాట! వివిధ మార్కెటు కేంద్రాల స్థాయిలో ఉన్న తారతమ్యాన్ని తెలుసుకోవాలనీ, పట్టణాలకూ, పల్లెలకూ తేడా గమనించాలని అర్థం! ఈ అన్ని రకాల ప్రజాస్వామికవర్గాల వారినీ, కృత్రిమంగా గాకుండా సహ జంగా ఐక్యపర్చేందుకు ప్రయత్నించాలి. పార్టీశుద్ధి, పునర్నిర్మాణ కార్యకలాపాలతో, వ్యవసాయక సంస్కరణలకోసం జరిపిన మహోజ్జ్వల ప్రజాపోరాటాలలో వేలకు వేలు ఉత్సాహవంతులూ, కార్యకర్తలూ ఉద్భవించారు. సిద్ధాంతపరిజ్ఞానాన్ని సంపాదించారు. వీరంతా ప్రజాసామాన్యాన్ని అంటిపెట్టుకున్నారు. చైనా పీపుల్సు రిపబ్లికుయొక్క అతి విలువైన సంపత్తి వీరే. ఇకముందు మనం వారు కార్యకలాపాలలో అవిచ్ఛిన్నంగా పురోగమించేటట్లు, వారికి సిద్ధాంతపరిజ్ఞానం కలుగజేయాలి. అదే సమయంలో మనం వారికొక హెచ్చరిక కూడా చేయాలి. విజయాలనూ, బహుమతులనూ చూచి ఉబ్బి తబ్బిబ్బవ్వరాదనీ, నిర్లక్ష్యభావాలను పెంపొందింపజేసుకోరాదనీ ఖచ్చితంగా హెచ్చ రించాలి. వీటన్నిటినీ, ఇంకా వివిధరంగాలలో విజయాలూ దృష్టిలో పెట్టుకొన్నప్పుడూ ఒక్క విషయం చెప్పాల్సి ఉంటుంది అదేమిటంటే, షాన్సీ - షుయాన్ విముక్త ప్రాంతం ఇదివరకటికన్నా కూడా మరింత దృఢం చేయబడిందని చెప్పాల్సి ఉంటుంది. ఇదే రకంగా చేసిన ఇతర విముక్తప్రాంతాలుకూడా ఇదే విధంగా దృఢతరం చేయ బడ్డాయి.

* * * *

పైన వివరించిన షాన్సీ - షుయాన్ విముక్తప్రాంతంలోని విజయాలకు, నాయ కత్వానికి సంబంధించినంతవరకు ప్రధాన కారణాలు ఇవి:

(౧) కామ్రేడ్ నిపాచీ వ్యక్తిగతంగా యిచ్చిన సూచనలప్రకారం, విన్సీన్ జిల్లాలో హోచియాపో గ్రామప్రభుత్వం కామ్రేడ్ కాంగ్ షెంగ్ గత శీతాకాలం

లోనూ, వేసవికాలంలోనూ జరిపిన కార్యకలాపాల సహాయంలోనూ గత సంవత్సరం జూన్‌లో షాన్సీ-షుయాన్ సెంట్రల్ సబ్‌బ్యూరో, సబ్‌డిస్ట్రిక్టు పార్టీ కార్యదర్శుల సమావేశం పిలిచింది. యీ సమావేశంలో గత కార్యకలాపాలలో మితవాద ధోరణులను విమర్శించటం జరిగింది. పార్టీ సంధానించి పక్కదారులతోక్కే అనేక తీవ్ర పరిస్థితులను స్పష్టంగా బట్టబయలుచేయటం జరిగింది. వ్యవసాయిక సంస్కరణల కార్యక్రమాన్ని పార్టీశుద్ధి పునర్నిర్మాణ కార్యకలాపాలను తీవ్రంగా అమలుజరపటానికి నిర్ణయం జరిగింది. యీ సమావేశం ప్రధానంగా ఒక విజయం. యీ సమావేశంవల్లనే కాకపోయినట్లయితే ఎంత పెద్దఎత్తున వ్యవసాయిక విప్లవకార్యక్రమాన్ని పార్టీశుద్ధి పునర్నిర్మాణ కార్యకలాపాలను విజయవంతం చేయటం సంభవమయ్యేదికాదు యీ సమావేశం సాధించలేకపోయినదేమిటంటే; పాత కొత్త విముక్త ప్రాంతాలలోను, యీ మధ్య విముక్తమయిన ప్రాంతాలలోనూ, వివిధ పరిస్థితులలో అమలుజరపాల్సిన కార్యక్రమాలు ఎంచి సరియైన వాటిని సగస్వభావాన్ని నిర్ణయించటంలో తల్లక్రిందులు అతివాద సూత్రాలను అన్వయించటం జరిగింది. జమీందారీ విధానాన్ని ఎలా రద్దుచేయాలి అనేసమస్యపై జమీందారులు గూడబెట్టిన ధనాన్ని గూర్చి దర్యాప్తు చేయాలనే విషయానికి ఎక్కువ ప్రాధాన్యమీయబడింది. ప్రజాసామాన్యంయొక్క సమస్యలను పరిష్కరించే విషయంలో తొందరపాటు జరిగింది. (Sobrieties)

"ప్రజలు కోరినట్లు సమస్యలను ఏదో ఒకవిధంగా పరిష్కరించండి" అనే నినాదాన్ని విచక్షణారహితంగా అమలుజరపటం జరిగింది. యీ చివరి సమస్య విషయంలో, అంటే – పార్టీకి ప్రజాసామాన్యానికి మధ్య ఎలాంటి సంబంధాలు వుండాలనే విషయంలో, ఏంచెయ్యాలంటే ప్రజలు మన్ని సక్రమమైన అభిప్రాయాలను పార్టీ నాయకత్వం వహించి పరిస్థితుల కనుగుణ్యంగా నడపాల్సివుంటుంది. ప్రజలలో ఉన్న పొరపాటు అభిప్రాయాలను పోగొట్టేందుకు పార్టీ, వారికి వాటిని సవరించుకొనే విధంగా విషయపరిజ్ఞానం కలుగజేయాలి. సబ్‌డిస్ట్రిక్టు పార్టీ కార్యదర్శుల సమావేశం ఒకవేళ సక్రమంగా నాకు చెప్పింది.

అదేమిటంటే పార్టీ ప్రజాసామాన్యంయొక్క అభిప్రాయాలకు నాయకత్వం వహించాలనే విషయం వదలివేయబడిన భాగం ఏమిటంటే, పార్టీ ప్రజాసామాన్యాన్ని నిర్ణాయకంగులను జేసి వారికి నాయకత్వం వహించాలనే విషయం. ఆ విధంగా కొన్ని ప్రదేశాలలోని కామ్రేడ్స్‌పై లోకపున్చుకుపోయే పెద్ద తప్పుప్రభావం ప్రసరించటానికి కారణమైంది.

(బి) షాన్సీ - షుయాన్ సెంట్రల్ సబ్ బ్యూరో ఈ జనవరిలో "అతివాద" ధోరణులను సవరించటానికి కావలసిన ప్రధాను చేపట్టింది. గత డిశంబరులో జరిగిన

కేంద్రకమిటీ సమావేశానికి సబ్ బ్యూరో కామ్రేడ్స్ హాజరై తిరిగి వచ్చిన దగ్గరనుంచీ యీ పంథా అనులుజరుపబడుతుంది. సబ్ బ్యూరో దాన్ని అంతంజేసేందుకు అయిదు సూచనల నిచ్చింది. పొరపాటు ధోరణులను సవరించటంలో వీరు తీసుకున్న నిర్ణయాలు ప్రజాసామాన్యం కోర్కెలకు ఎంతో అనువైనవి. యిది కొద్దికాలంలోనే దాదాపు అన్ని "అతివాద" ధోరణులను సవరించ గలిగినంత స్పష్టమైన వేగమైన పంథా.

హాన్సీ - షు యాన్ పార్టీ జపాను వ్యతిరేక యుద్ధకాలంలో తీసుకున్న పంథా చాలవరకు సరియైనది. యీ విషయం పన్నులు వడ్డీలు తగ్గించటంలోనూ, గణింపదగినంత వ్యవసాయిక అభివృద్ధి వుత్పత్తి విషయాలనూ, స్వదేశ బట్టల పరిశ్రమలోనూ, మిలటరీ పరిశ్రమలోను కొన్ని తేలిక పరిశ్రమలలోను పార్టీ పునాదిని ఏర్పరచటంలోను ప్రజాతంత్రప్రభుత్వాన్ని ఏర్పరచటంలోనూ, పదిలక్షల ప్రజాసైన్యాన్ని నిర్మించటంలోను, జయప్రదమైన జపాను వ్యతిరేక యుద్ధాన్ని నిర్వహించటలోను, యిన్ హే షాన్, ఫ్యూ షోయీ యింకా యితర అభివృద్ధి నిరోధకుల దాడులనుకూడా తిప్పికొట్టటంలోను ఎంతో స్పష్టంగా కన్పిస్తుంది. పార్టీ ప్రభుత్వంకూడా యీ దశలో కొన్ని లోపాలనుకూడా చేసినమాట వాస్తవమే. మనం వాటన్నిటిపైన స్పష్టంగా చూచాం - పార్టీ కార్యవిధానంలోను నిర్వహణలోను ఏర్పడిన కల్తీవల్ల కార్యకలాపాలకు అనుకూలమైన పరిస్థితి ఏర్పడటం జరిగింది. మొత్తం పరిస్థితినంతా సమీక్షిస్తూ జపాను వ్యతిరేక యుద్ధకాల కార్యక్రమం మంచి ఫలితాల నిచ్చింది. జపాను లొంగుబాటు తర్వాత జంగ్ కై షేక్ చేసిన విప్లవ ప్రతీఘాత దాడులను వోడించటానికి అనువైన పరిస్థితులను కలిగించింది. హాన్సి-షు యాన్ పార్టీ జాపాన్ వ్యతిరేక యుద్ధకాలంలో చేసిన లోపం ప్రధానంగా వారు విశాల ప్రజాసామాన్యంపై ఆధారపడలేక పోవటమే! ప్రజాసామాన్యంయొక్క సహాయంతో పార్టీలో ఏర్పడిన కల్తీ కార్యవిధానాలను సరిచేయలేదు. పార్టీలోను, ప్రభుత్వంలోను ఏర్పడిన కుళ్లును తొలగించటానికి చెడు ఫలితాలనుంచి బయటపడటానికి ప్రజల సహాయం తీసుకోలేదు. ఆ విధంగా యీ బాధ్యతను వారు ప్రస్తుతం మీ కప్పగించారు. హాన్సి-షు యాన్ పార్టీ నాయకత్వంలో కొందరు ప్రత్యక్షపరిస్థితులను సరిగా అర్థం చేసుకోలేకపోవటంవల్ల, ఆ దశలో ఆ పరిస్థితి ఏర్పడటానికి కారణమైనది. యిదికూడా ఒక గుణపాఠంగా పార్టీ కామ్రేడ్సు అందరు తీసుకోవాలి.

హాన్సీ-షుయాన్ పార్టీయొక్క భవిష్యత్తు విధులు పార్టీ శుద్ధ పునర్నిర్మాణం వ్యావసాయిక సంస్కరణ కార్యక్రమాన్ని తీవ్ర కృషిద్వారా కొనసాగించటం, పరిపూర్ణం చేయటం, ప్రజా విప్లవ సమరాన్ని బలపరచటం అభివృద్ధిని కొనసాగించటం, ప్రజల నెత్తిన భారాన్ని పెంచటం గాకుండా సర్వంగా బరువు తగ్గించటం, వుత్పత్తిని

కొలుకునేటట్లు, అభివృద్ధి అయ్యేటట్లు చేయటం, మీ రప్పుడు ఒక ఉత్పత్తి మహాసభను ఏర్పాటు చేయబోతున్నారు. వుత్పత్తిని అధికం జేయటం, కొరతను పూర్తి జేయటం - యిదే విప్లవ కార్యక్రమముయొక్క అంతిమ ఆదర్శం. యీమధ్య అనేక సంవత్సరాలుగా వుత్పత్తిని అభివృద్ధిజేయటంలోను కోలుకోవటం అనే విషయం ఒక ప్రక్క ప్రజల జీవిత స్థాయిని పెంచటానికి అదేసమయంలో ప్రజావిప్లవ సమరాన్ని బలపరచటానికి తోడ్పడింది. మీకు చాలా పెద్ద వ్యవసాయం, చేతిపరిశ్రమలు వున్నాయి. అదేవిధంగా కొన్ని ఆధునిక భారీ పరిశ్రమలు తేలిక పరిశ్రమలుకూడావున్నాయి. మీరు యీ వుత్పత్తి కార్యక్రమాన్ని కొనసాగించటంతో మీ విధులను సక్రమంగా నిర్వర్తించి నాయకత్వం వహిస్తారని నా నమ్మకం. లేకపోయినట్లయితే మీరు సరైన మార్క్సిస్టులుగా ఎంచబడరు. వ్యావసాయిక రంగంలో నిరంకుశ శక్తుల అధికారం క్రింద గతంలో నడపబడిన పరస్పర సహాయ శ్రామిక కూటములు, సహకార సంఘాలు ప్రజలకు భారమై నాశనమైనాయి. దీన్ని మనంపూర్తిగా అర్థంజేసుకోవచ్చు. అందుకు ఏమాత్రం విచారించవలసిన పనిలేదు. మీ బాధ్యత పరస్పర సహాయ శ్రామిక కూటములను సహకార సంఘాలను కాపాడటంలో గూర్చి చాల జాగ్రత్తగా అభివృద్ధి చేయటంలోనున్నది. యింకా ప్రజాసహకారపుగు యితర అవసర ఆర్థిక సమయాలను చాలా జాగ్రత్తగా జిల్లాలలోకి వ్యాపింపజేయటం యివీ మీ బాధ్యత.

## తిరిగి తర్ఫీదుయిచ్చే వుద్యమం

దేశవ్యాపిత పరిస్థితిని తెలుసుకోవాలని కామ్రేడ్స్ చాలా కుతూహలపడుతున్నారు. గత సంవత్సరం పార్టీ జాతీయ వ్యావసాయిక మహాసభలో ఒక నూతన పంథాను తీసుకునేందుకు నిర్ణయించినప్పటినుంచి వ్యావసాయిక సంస్కరణలు పార్టీ శుద్ధి పునర్నిర్మాణం విషయాలను గురించి, దాదాపు అన్ని విముక్తప్రాంతాలలోను పార్టీసమావేశాలు పెద్దఎత్తున జరుపబడినాయి. ఆసమావేశాలలో పార్టీలోవున్న మితవాద ధోరణులను, పార్టీ కార్యనిర్వహణా విధానంలోను ఏర్పడిన కీర్తిని బట్టబయలు చేస్తూ ఆత్మవిమర్శలు జరిగాయి. తర్వాత చాలా ప్రాంతాలలో "అతివాద" ధోరణులను సవరించటానికి కార్యక్రమం వేసుకున్నారు - లేదా యిప్పుడు తీసుకుంటున్నారు. యిది దేశవ్యాపితంగా మన పార్టీ నూతన పరిస్థితులకు తగినట్లు నూతన బాధ్యతలను తీసుకునేటట్లు అభివృద్ధివేపు పురోగమించేందుకు తోడ్పడింది. ఆచరణలో ప్రజా విముక్త సైన్యాలన్ని యీ కొద్దిమాసాలలో వచ్చిన విశ్రాంతి కాలాన్ని పెద్దఎత్తున తిరిగి తర్ఫీదు యివ్వటానికి వుపయోగించుకున్నారు. యీ తర్ఫీదు యివ్వటం ఒక క్రమ విధానంలో నాయకత్వం క్రింద ప్రజాస్వామిక పద్ధతులపై జరిగింది. దీనిద్వారా సైనిక, సేనానాయక సమూహాలలో విప్లవచైతన్యం కల్పించబడింది. యుద్ధవిశేషాలు స్పష్టంగా తెలుసుకున్నారు. సైన్యంలో కొన్ని పొరపాటు సిద్ధాంతధోరణులు అననుకూల పరిస్థితి

తొలగించబడ్డాయి. కేడర్లు, సైనికులు విషయపరిజ్ఞానాన్ని పొందారు. యుద్ధనిపుణ శక్తిని పెంపొందింపజేసుకొన్నారు. యీ రకమైన ప్రజాస్వామిక, కొత్తరకమైన పద్ధతుల్లో సైన్యం మొత్తంమీద తిరిగి తరిఫీదు పొందటం భవిష్యత్తులో కూడా కొనసాగించబడాలి. మన శత్రువు కొమింటాంగు పక్షం, మనం నడిపిన పార్టీ సుద్ధి పునర్నిర్మాణం సైనికులకు తిరిగి తర్ఫీదు, పోరాటం, వ్యవసాయక సంస్కరణలు వీటిల్లో ఏ ఒక్క విషయంలో కూడా మనం అమలుజరిపినట్లు మన శత్రువు అమలుజరపలేదనే విషయం ఎంతో చారిత్రక ప్రాముఖ్యాన్ని కలిగివుంది. మనకు సంబంధించిన తనగకు మనం మన తప్పులన్నిటిని హృదయపూర్వకంగా సవరించుకొనుట ద్వారా మన పార్టీ, సైన్యం ఆచరణలో ఒక్క వ్యక్తి లాగా ఐక్యమైనాయి. మొత్తం పార్టీ సైన్యం ప్రజాసామాన్యం ఒకరికొకరు ఎంతో సన్నిహితులుగావుండి మన కేంద్రకమిటీ యిచ్చిన సంధానం, ఎత్తుగడలను చురుకుగా కొనసాగిస్తూ ప్రజావిప్లవ సమరాన్ని జయప్రదంగా ముందుకు తీసుకు వెళ్తున్నాం. యిక మన శత్రువో! ప్రతివిషయంలోనూ దీనికి పూర్తిగా వ్యతిరేకం. వారిలో ఎంతో అవినీతి, పరిష్కరించలేని అంతఃకలహాలు [illegible] పెరుగుతున్నాయి. ప్రజలనుంచి దూరమయ్యారు. ఎన్నో యుద్ధరంగాలలో వోడిపోతున్నారు. అంటే వారు తప్పనిసరియైన వినాశంవైపు వెళ్తున్నారు. చైనా విప్లవ ప్రతీఘాత శక్తులకు సంబంధించిన రెండు పక్షాల, రెండు సైన్యాలమధ్య తారతమ్యంయొక్క సారాంశం యిది.

## విశాలమైన ఐక్యసంఘటన

ఈ పరిస్థితిలో నూతన ప్రజాస్వామిక విప్లవానికి సంబంధించిన సాధారణ సూత్రాన్ని పార్టీ కార్యకర్తలందరూ గ్రహించాలి. నూతన ప్రజాస్వామిక విప్లవం ప్రజాసామాన్యంయొక్క ప్రజాతంత్ర విప్లవమే గాని మరొకటి కాదు. కార్మికవర్గ నాయకత్వాన సామ్రాజ్యవాద, జమీందారీ, నిరంకుశ పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటమే ఇది! అంటే అర్థం, ఈ విప్లవానికి చైనా కమ్యూనిస్టుపార్టీ కన్నా మరొకరు నాయకులు కారు. కార్మికవర్గంకన్నా మరొకవర్గం దీనికి నాయకత్వం వహించదు. అంటే విప్లవంలో పాల్గొనేటటువంటి, ప్రజలచే నిర్మింపబడిన ఐక్యసంఘటన అతి విశాలమైంది. ఇందులో కార్మికులూ, రైతులూ, స్వతంత్రంగా జీవించే శ్రమజీవులూ, వివిధ వృత్తిపనివారూ, మేధావంతులూ, లిబరల్ బూర్జువావర్గం, ఇంకా ధనికభూస్వాములతో సంబంధాలు తెగతెంపులు చేసుకున్న విజ్ఞానవేత్తలూ, అంతా ఉంటారు. వీరినే ప్రజాసామాన్యంయొక్క ఉన్నతి ప్రజాసమూహమని మనం పిలుస్తాం. ఈ ఉన్నత ప్రజాసమూహంచే ఏర్పర్చబడిన ప్రభుత్వం, ప్రభుత్వయంత్రం, చైనా పీపుల్సు డెమాక్రటిక్ రిపబ్లిక్, ఇంకా మిశ్రమప్రభుత్వం ఇవన్నీ మొత్తం ప్రజాస్వామిక వర్గాలన్నిటియొక్క సంయుక్త పరిపాలన చేస్తాయి. ఈ విప్లవంచే నాశనం చేయబడే

శత్రువులు కేవలం, సామ్రాజ్యవాద, జమీందారీ, నిరంకుశ పెట్టుబడిదారీ విధానాలు మాత్రమే! ఈ శత్రువుల కూటమి విస్పష్టరూపం జంగ్-కై-షేక్ అభివృద్ధి నిరోధక కోమింటాంగు పరిపాలన.

ఫ్యూడలిజం సామ్రాజ్యవాదానికీ, నిరంకుశ పెట్టుబడిదారీ విధానానికీ మిత్రుడు; ఆ విధానాలకు మూలకారణంకూడా! కాబట్టి వ్యావసాయక విధానంలో సంస్కరణే చైనా నూతన ప్రజాస్వామిక విప్లవానికి ముఖ్యసూత్రం. వ్యవసాయక సంస్కరణ యొక్క జనరలు పంథా - పేద రైతాంగంపై ఆధారపడటం, మధ్యతరగతి రైతాంగాన్ని ఐక్యం చేసుకోవటం, దోపిడిచేసే పద్ధతిని నిర్మొగమాటంగానూ, ఒక క్రమ పద్ధతిలోనూ నిర్మూలించటం, వ్యావసాయిక ఉత్పత్తిని అభివృద్ధిచేయటం. వ్యావసాయిక విప్లవంలో తప్పనిసరిగా ఆధారపడవలసిన శక్తి పేద రైతాంగమే. చైనా గ్రామీణ జనాభాలో నూటికి డెబ్బయిమంది, పేదరైతులూ, వ్యవసాయ కూలీలే! వీరిని సంతృప్తిపరచటమే వ్యావసాయక సంస్కరణలయొక్క ప్రధాన బాధ్యత. చైనా గ్రామీణ జనాభాలో నూటికి 20 మందిగా ఉన్న మధ్యతరగతి రైతాంగాన్ని, పేద రైతు, వ్యవసాయకూలీలతోపాటు సుస్థిర ఐక్యసంఘటనలోకి తీసుకురావాలి. ఇదే గనక జరక్కపోయినట్లయితే, పేదరైతాంగం, వ్యవసాయకూలీలు వేరు చేయబడతారు. వ్యవసాయ సంస్కరణ విఫలమౌతుంది.

వ్యవసాయ సంస్కరణల బాధ్యతల్లో ఒకటి మధ్యతరగతి రైతాంగంయొక్క కోర్కెను సంతృప్తిపర్చటం. మామూలుగా సగటు పేదరైతుకిచ్చిన భూమికన్నా మధ్యతరగతి రైతు ఎక్కువ భూమిని కలిగి ఉండటానికి అవకాశం కలుగజేయాలి. భూమి సమాన పంపకం విషయంలో రైతాంగంయొక్క కోరికను మనం బలపరుస్తున్నామంటే దాని అర్థం - జమీందారీ, భూస్వామ్యవర్గం భూమిపై యాజమాన్యం వహించే పద్ధతిని, నిర్మూలించేందుకు వీలుగా రైతాంగంలోని విశాల ప్రజాసమూహాన్ని ఉత్తేజితులను చేసేందుకే! అంతేగాని సంపూర్ణ సమానత్వాన్ని వర్తింపచేయటం కాదు. సమానత్వాన్ని ఎవరు వర్తింపజేసినప్పటికీ అది తప్పు. నేటి పారిశ్రామిక, వాణిజ్యాలను నాశనం చేయాలని, భూమి పంపకం విషయంలో సర్వ సమానత అమలు జరపాలనేది నేటి గ్రామాల్లో వ్యాపించియున్న సిద్ధాంతాన్ని ఒక రకమైన వ్యావసాయిక సోషలిస్టు ఆలోచన. ఈ రకమైన వాదన కేవలం అభివృద్ధినిరోధకం. పూర్తిగా వెనకబడిన స్వభావం కలది. ఈ సిద్ధాంతాన్ని మనం విసర్జించాలి. వ్యవసాయ సంస్కరణ యొక్క ఆశయం, తప్పనిసరిగా భూస్వామ్యవర్గపు ధనిక రైతాంగపు ఫ్యూడల్ విధానపు దోపిడిని నిర్మూలించటం ఒక్కటే! లిబరల్ బూర్జువావర్గ, ధనిక రైతులూ నడుపుతున్న పారిశ్రామిక వాణిజ్యాలనుంచి చుట్టటం వ్యావసాయిక సంస్కరణయొక్క ఆశయం కానేకాదు. మధ్యతరగతి రైతాంగం, స్వతంత్రంగా జీవించే కష్టజీవులూ, వృత్తి

పనివారూ, కొత్తపనివారూ, కొత్తరకమైన ధనికులూ, ఈదోపిడీలో భాగస్తులు కాకుండయుండేవారు; లేక కొంచెం భాగస్తులయినవారిని అనవసర బెడదలపెట్టక, వీరి విషయాలలో జోక్యం కలుగజేసుకోకుండా ఉండాలనేసూత్రానికి ప్రత్యేక ప్రాధాన్యత నీయాలి. వ్యవసాయ సంస్కరణయొక్క ఆశయం ఫ్యూడల్ విధానపుదోపిడిని నిర్మూలించటం అంటే అర్థం జమీందారులు ఒకవర్గంగా నిర్మూలించబడాలి. అంతేగాని జమీందారులు వ్యక్తులుగా నిర్మూలించబడాలనిగాదు. కాబట్టి భూస్వాములకు రైతాంగంతో పాటు సమానంగా భూమి, ఆస్తిపంచాలి. ఇంకాపనిచేయటానికి, ఉత్పత్తిచేయటానికి, జాతీయఆర్థిక జీవితంలో భాగస్వామి కావటానికికూడా వీరికి అవకాశం కలుగజేయాలి. విప్లవప్రతీఘాతశక్తులు, అంతులేని తప్పిదాలు చేసేకిరాతకులూ, ప్రజాసామాన్యాన్ని విపరీతంగా ద్వేషించేవారూ, వీరందరినీ స్పష్టమైన సాక్ష్యమున్నప్పుడు తప్పనిసరిగా శిక్షించాలి. విచక్షణారహితమైన, ఏరకమైన దౌర్జన్యాన్నయినా నిషేధించాలి. ఇందుతోపాటు ఆ ప్రజానీకం యెడల సాధారణ మర్యాద చూపాలి.

ఫ్యూడల్ విధానపు దోపిడిని క్రమబద్ధంగా నిర్మూలించాలంటే అర్థం ఎత్తుగడల ద్వారానని, చుట్టుప్రక్కల పరిస్థితినిబట్టి పోరాటాన్ని ప్రారంభించే, కొనసాగించే విధానాలనూ, ఎత్తుగడలనూ నిర్ణయించాలి. రైతు జనసామాన్యంయొక్క చైతన్యస్థాయికి సంఘటిత స్వరూపాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. జమీందారీ విధానపు దోపిడినంతా తెల్లవారేటప్పటికి అంతం చేయాలని ప్రయత్నించకండి! జమీందారీ విధానపు దోపిడి పద్ధతియొక్క వాస్తవిక పరిస్థితులను చూస్తే మొత్తం వ్యవసాయక విప్లవోద్యమం దెబ్బకొట్టేది చైనా గ్రామీణ జనాభాలో నూటికి 8 లేక 10 మంది మాత్రమేనని అర్థమవుతుంది.

## పాత, కొత్త ప్రదేశాలలో

పూర్వ, మధ్యకాలాలలో విముక్తిఅయిన ప్రాంతాలలో ఈ సంఖ్య ఇంకా తగ్గుతుంది. వాస్తవిక పరిస్థితులకు అతీతంగా పోయి దెబ్బకొట్టవలసిన ప్రదేశాన్ని పొరపాటు కారణంగా ఎక్కువచేసుకోవటం ప్రమాదకరం. నూతన విముక్తి ప్రాంతాలలో వివిధ మండలాలకూ, విభిన్న దశలకూ తారతమ్యాన్ని చూపటంకూడా అవసరం. మండలాలలో తారతమ్యం చూడటంకంటే అర్థం—గట్టిగా ఆక్రమించుకోటానికి వీలుగాఉన్న ప్రదేశాలలో మన బలాన్నంతా కేంద్రీకరించి ఆ మండల ప్రాంతీయ ప్రజాసమూహానికి అనువుగా ఉండే వ్యావసాయిక సంస్కరణల విధానాన్ని కొనసాగించాలి. మనం గట్టిగా ఆక్రమించటానికి తాత్కాలికంగా వీలులేని మండల ప్రాంతాలలో వ్యావసాయక సంస్కరణ చేసేందుకు తొందరపడరాదు. అంతకన్నా అంతకు పూర్వమున్న పరిస్థితులను మార్చేటువంటి, అప్పటి పరిస్థితులకనుగుణ్యంగా ప్రజాసామాన్యానికి మేలు చేకూర్చేటటువంటి; ఏదో ఒక కార్యక్రమాన్ని చేపట్టాలి. విభిన్న దశల

మధ్య తారతమ్యం చూడాలంటే అర్థం - ప్రజా విముక్తిసైన్యం అప్పుడే ఆక్రమించిన ప్రదేశంలో ధనికరైతును తటస్థంగా ఉండేటట్లుచేసి, మధ్యతరగతి పేదరైతాంగాన్ని ఏకం చేసే ఎత్తుగడను అవలంబించటంద్వారా, కామింటాంగు అభివృద్ధినిరోధకసైన్యాన్ని నిర్మూలించి, జమీందారీ దుష్టశక్తులపై మనశక్తిని కేంద్రీకరించాలి. కొత్త ప్రాంతాలలో ఈ బాధ్యతలను నిర్మించటమే మొదటిదశలో మన విధి. తర్వాత పరిస్థితులనుబట్టి, ప్రజలలో సంఘటితశక్తి, చైతన్యం ఎంతవరకు అభివృద్ధి అయినా యోచించినా వేసుకుని ఒక్కొక్క అడుగే ముందుకువేస్తూ మొత్తం ఫ్యూడల్ విధానాన్నే నిర్మూలించేటంత వరకూ పురోగమించాలి.

క్రొత్త ప్రాంతాలలో అధిక సంఖ్యాక ప్రజానీకాన్ని ఉత్తేజితులను జేసిన తర్వాతనే, వాతావరణం కొంతవరకు కుదుటపడిన తర్వాతనే వగాస్థి, భూమి పంపకాలకు పూనుకోవాలి. లేకపోతే అది పూర్తిగా పొగపాటు పంథా! వాస్తవానికతీతం! వెలిగాకితనం! క్రొత్త ప్రాంతాలలో జపాను వ్యతిరేక యుద్ధకాలపు అనుభవాన్ని పూర్తిగా వినియోగించుకోవాలి. విచక్షణా జ్ఞానంతో జమీందారీ విధానాన్ని రద్దు చేయుటయంటే అర్థం జమీందార్లకూ ధనిక రైతులకు మధ్య, పెద్ద, మధ్యతరగతి, చిన్న భూస్వాములకు మధ్య క్రూర, సాధారణ ధనశక్తిపరులకు మధ్య తారతమ్యాన్ని చూపాలి. అంటే భూమి సమాన పంపకం జమీందారీ విధాన నిర్మూలన అనే జనరలు సూత్రాలను అన్నిటా ఒకే విధంగా సామ్యంలేని వారందరికీ అన్వర్తింపచేయరాదు. దానికంటే వివిధ రకాలుగ విచక్షణతో వివిధవిషయాలలో వ్యవహరించాలి ఈరకంగా చేయటంవల్ల మనం చేసే పనిపూర్తిగా సమర్థనీయమైనదని ప్రజాసామాన్యం భావిస్తుంది.

## వ్యవసాయాభివృద్ధి :

వ్యవసాయ సంస్కరణయొక్క ప్రత్యేక ఆశయం, వ్యవసాయ ఉత్పత్తిని అభివృద్ధి చేయుటం, జమీందారీ విధానాన్ని నిర్మూలించటంద్వారానే వ్యవసాయక ఉత్పత్తి అభివృద్ధి చేసేందుకు, ఏ ప్రాంతంలోనైనా జమీందారీ విధానం నిర్మూలించగనే వ్యవసాయ సంస్కరణ పూర్తిఅవగనే, పార్టీ ప్రజాస్వామిక ప్రభుత్వం వెంటనే వ్యావసాయిక ఉత్పత్తిని అభివృద్ధిచేయుటకు సహాయ సహకార సంఘాలను నిర్మించుటకు, వ్యవసాయ నిపుణతను అభివృద్ధిచేయుటకు మేలురకం విత్తనాలు తయారుజేయుటకు, జలాధార వసతులను కల్పించుటకు, ఉత్పత్తి అభివృద్ధిచేయు అవకాశాలను కలుగజేయుటకు పూనుకోవాలి. గ్రామాలలో పార్టీశక్తినంతటినీ కేంద్రీకరించి వ్యావసాయిక ఉత్పత్తి పెంపుదలలకు పట్టణాలలో పారిశ్రామికాభివృద్ధిని త్వరితంగా కొనసాగించటానికి, కృషి జేయవలసియుంది.

మేలురకం విత్తనాన్ని తయారుచేయుటం, జలాధారవసతులను కల్పించటం, ఉత్పత్తి అభివృద్ధిచేయుటానికి అవకాశాలను కలుగజేయటం, యిదే ప్రధాన బాధ్యతలు.

గ్రామాలలోను పార్టీశక్తి నంతటినీ సమీకరించి వ్యావసాయిక వుత్పత్తి పెంపుదలలకు కృషిజేయాలి. పట్టణాలలో పారిశ్రామిక అభివృద్ధికి కృషిజేయాలి. వ్యావసాయిక వుత్పత్తి పెంపుదలలకు పట్టణాలలో పారిశ్రామికాభివృద్ధిని ఫ్యూడల్ విధానాన్ని నిర్మూలించేందుకు జరిగే పోరాటసమయంలో అన్ని వుత్పత్తిసాధనాలను, జీవితావసరవస్తువులను సాధ్యమైనంతవరకు ఎక్కువగా సంరక్షించాలి. అట్టివాటిని నాశనంచేయటంగాని, దుబారా పర్చటంగాని జరిపే ప్రయత్నాన్ని పూర్తిగా ఎదుర్కోవాలి. యీ విషయంలో మాత్రం గట్టిచర్యలు తీసుకోవాలి. వ్యక్తిగత ఆస్తి సూత్రంపై ఆధారపడిన ప్రస్తుత ఆర్థికపరిస్థితులలో అవకాశమున్న వుత్పత్తి కొనుగోలుదారుల సహకారసంఘాల ఆవశ్యకతను రైతాంగానికి నచ్చజెప్పి వ్యవసాయకోత్పత్తిని అభివృద్ధిచేసేందుకు అవసరమైనవిగా, వైపద్ధతులవైపు రైతాంగాన్ని సమీకరించాలి. యిదే వ్యవసాయ వుత్పత్తి పెంపుదలకు అవసరం. భూస్వామిక విధానాన్ని నిర్మూలించటం, వ్యావసాయకోత్పత్తిని అభివృద్ధి పర్చటం – వ్యావసాయిక దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చటంలోనూ, పారిశ్రామికోత్పత్తిని పెంచటంలోనూ ప్రధాన భూమికను వహిస్తాయి. ఇదే వ్యవసాయ విప్లవంయొక్క అంతిమ ఆశయం.

కామ్రేడ్స్, చైనా విప్లవముయొక్క ప్రధానపంథా, కార్యక్రమాలను పార్టీ నిర్ణయించిందనే విషయం మీకు తెలుసు. అంతేగాకుండా అనేకమైన నిర్దిష్ట కార్యవిధానాలను, నిర్దిష్టపంథాను తీర్చిదిద్దిందనే విషయం మీకు తెలుసు. అయినా చాలా మంది కామ్రేడ్స్ కొన్నిసమయాలలో ప్రధానపంథా, కార్యక్రమాలను మర్చిపోయి కొన్ని పార్టీయొక్క ప్రత్యేకపరిస్థితులలో అవలంబించవలసిన పంథా, కార్యక్రమాలనే గుర్తుంచుకోవటం జరుగుతోంది. ఆవిధంగా ఏ కామ్రేడైనా పార్టీ జనరల్ పంథానే మర్చిపోయినట్లయితే ఆ కామ్రేడ్ గుడ్డితనంతో ప్రవర్తిస్తాడు. వాస్తవిక విప్లవవాది కాలేడు. అటువంటి కామ్రేడ్ ఒక నిర్దిష్ట కార్యక్రమాన్ని, స్పష్టమైన పంథాను ఆచరణలో పెట్టేటప్పుడు గడియారపు గుండువలె ఒకపర్యాయం ఎడమకు, మరొకపర్యాయం కుడికి తిరిగినట్లు నిలకడలేనివాడుగాతయారై అటూయిటూ వూగిసలాడుతూ పార్టీ కార్యక్రమాన్ని హాసికలుగ జేస్తాడు.

మరొక్కసారి నొక్కిచెప్తున్నా, చైనా నూతన ప్రజాస్వామిక విప్లవం అంటే – "అశేష ప్రజానీకంయొక్క విప్లవం. కార్మికవర్గ నాయకత్వాన, సామ్రాజ్యవాద, భూస్వామ్య, నిరంకుశ పెట్టుబడిదారీ విధానాలకు వ్యతిరేకంగా సాగేపోరాటం యిదే ప్రస్తుత చారిత్రకపరిస్థితిలో చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క ప్రధానకార్యక్రమం".

"పేద రైతాంగముపై ఆధారపడి, మధ్యతరగతి రైతాంగ ఐక్యతతో, భూస్వామ్య విధానపు దోపిడిని క్రమపద్ధతిలో, విచక్షణతో నిర్మూలించి, వ్యావసాయికోత్పత్తిని అభివృద్ధిపర్చడం నూతన ప్రజాస్వామిక విప్లవములో వ్యవసాయ సంస్కరణ యెడ చైనా కమ్యూనిస్టుపార్టీ వైఖరి ఇదే!